శ్రీరస్తు

# శ్రీరంగనాథరామాయణము

## ద్విపదకావ్యము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము



[Price Rs. 6—0—0

# జ్ఞాపిక

ఆర్యులారా!

ఈ రంగనాథరామాయణము పూర్వముద్రణమునందు మంచి వ్రాతప్రతులు దొరకనందునఁ బూర్వతరముద్రితములగు ప్రతులసాహాయ్యముననే కొంతవఱకు సంస్కరింపించి ముద్రించితిమి. తరువాతఁ గొన్నిదినములకు రెండుమూఁడు వ్రాఁతప్రతులు మామిత్త్రులు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారివల్ల లభించుటవలన వానిం బట్టి మహాపండితులగు శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులుగారిచేతను, శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగారిచేతను బూర్వముద్రణములో వదలిపోఁబడిన భాగములను బొందుపఱిచి చక్కఁగ సంస్కరింపించి ముద్రించినారము. కావున నింకను నెందేని యపూర్వవర్ణనాభాగములు గల ప్రాఁతవ్రాఁతప్రతు లుండెనేని పంపినచోఁ బునర్ముద్రణమునఁ గూర్చుకొనియెదము. రంగనాథకృతమగు నుత్తరకాండము గూడ లభించినది. దానిని బ్రత్యేకసంపుటముగాఁ బ్రకటించుచున్నారము.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# పీఠిక



## రంగనాథుఁడు

ఈ మహాకవి రామాయణమును ఆఱు కాండములు ద్విపదగా సాంధ్రీకరించెను. ఇతఁడు రామాయణమును తాను రచించినట్లు గ్రంథమున నెచ్చటను చెప్పుకొనలేదు; కాని గ్రంథములకు నామములు కవులనుబట్టియుఁ, గృతిపతి ననుసరించియుఁ, గథనుబట్టియుఁ బెట్టఁబడుచుండును గాన రంగనాథుఁడే రామాయణమును రచించె నని వచించుట కనుమాన మొందవలసిన యవసరము లేదు.

కోనబుద్ధరాజు తాను రామాయణమును ద్విపదగా నాంధ్రీకరించి తన తండ్రి యగు విట్ఠలరాజునకుఁ గృతి యిచ్చినట్లు కాండాంతములయందుఁ జెప్పఁబడి యున్నది.

"అని యాంధ్రభాషా భాషాధీశవిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి, భూలోకనిధి కోనబుద్ధభూవిభుఁడు
తనతండ్రి విట్ఠలధరణీశు పేరఁ, గమనీయగుణ [illegible]
బనిపూని యరిగండభైరవు పేర, సాంద్రతారార్కమై యుర్వి మీఁద
భూచక్రమున నతిపూజ్యమై వెలయు, ననుమానలలితకట్టార్థసంగతుల
రసికమై వెలయొందు రామాయణంబు......"

దీనింబట్టి కూడ బుద్ధరాజు రామాయణమును రచింపలే దని స్పష్టమగుచున్నది. ఎట్లన:—సాధారణముగా విద్వత్కవు లాత్మస్తుతిని జేసికొనువారు కారు. ఒకానొకఁ డట్లు తన్నుఁ దా స్తుతించుకొన్నను నీలాగున వ్రాసికొనుట యుండదు గానము.

ఇందు బుద్ధరాజునకు:—౧. భాషాధీశవిభుఁడు, ౨. వినుతకావ్యాగమవిమల మానసుఁడు, 3. పాలితాచారుఁడు, ౪. అపారధీశరధి, ౫. భూలోకనిధి అను నైదు విశేషణములు వాడఁబడి యున్నవి. వాస్తవముగా నీవిశేషణముల కీరాజు తగిన వాఁడేయైయుండు ననుకొన్నను దాను వ్రాసిన యీ ద్విపదకావ్యమున నిన్ని విశేషణములు స్వవిషయమునఁ దోరణము గూర్చినట్లు చేర్చియుండు ననుకొనుట సమంజసముగా లేదు. సాధారణముగా లోకమున నూటిలోఁ దొంబదితొమ్మిదిమంది యాత్మస్తుతిపరాయణులు కారా యని ప్రశ్నింపవచ్చును. ఐనను అట్టివారు లేరని చెప్ప

వీ యుండదు గాని యట్టివా రితరులచేతఁ దమ్ముఁ బొగడించుకొందు రనిచెప్పుట యుక్తిహీనము గాదు.

శ్లో. "వాణీం కాణభుజీమజీగణదవాసాసీచ్చ వైయాసికీ
మంతస్తంత్ర మరంస్త పన్నగగవీగుంఫేషు చాజాగరీత్,
వాచామాకలయద్రహస్యమఖిలం యశ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యజన్యం యశః."

అని కోలచలమల్లినాథసూరి చెప్పుకొన లేదా? యనిప్రశ్న వేయవచ్చును.

కోలచలమల్లినాథసూరి కావ్యపంచకమునకును నైషధమహాకావ్యమునకును వ్యాఖ్యల వ్రాసినమహానుభావుఁడు. ఈకాలమున బిరుదములు చెల్లినట్లాకాలమునఁ జెల్లకుండెను. బిరుదమును ధరించినవాని నెట్టియినను బట్టిచూచుచుండిరే కాని సాధారణముగా విడిచి పెట్టినవారు కారు. మల్లినాథుని యంతకు ముందు వ్యాఖ్య వ్రాసినవారు మూలగ్రంథమును బాగా చేసి యున్నందునఁ దాను వ్రాయఁబూనిన వ్యాఖ్య సమంజసముగ నుండునే కాని ముందటిదానివలె నపార్థమును బోధింప దను విషయమును లోకులు తెలిసికొందురుగాక యనియు, వ్యాఖ్య వ్రాయఁ బూనినవాని కన్నిశాస్త్రములలోఁ బాండిత్య ముండియే తీరవలెనో యాసంగతిని దెలుపుటకును నట్లు చెప్పుకొనియెం గాని వేఱుగా దని కొంద అనుచున్నారు. పంత ముగ వ్యాఖ్య వ్రాయఁబూనినందునఁ బరపక్షవాదుఁ గుండెఁ గపియుఁగాక యని యీలాగునఁ జెప్పినాఁడని కొందఱు వాదించుచున్నారు. ఏది యెట్లున్నను ఈమహా కవి వ్యాఖ్య రచించిన వాఁడేకాని మూలకర్త గానందున మన మీయుదాహరణ మును బ్రకృత కవినిర్ణయఘట్టమున గ్రహింప ననవసరము. కాళిదాసాదు లిట్లుచెప్పు కొనలేదుగదా!

సీ. "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ, జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది, నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర, జాతు నద్విజు లోకవాదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి, శోభితు సత్ప్రతిభాభియోగ్యు
తే. నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ."

అని నన్నయభట్టారకుఁడు చెప్పుకొనలేదా? యనియు నడుగవచ్చును.

క. హరుఁడవు చతురవచోనిధి, వరులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వఁ డీడు పేర్కొన నీకున్."

అని యల్లసాని పెద్దనకవిశిరోమణియుఁ జెప్పుకొన్నాఁడుగదా? యని కూడ నొక ప్రశ్న వేయవచ్చును. ఇట్టి వెన్నియో యుదాహరణములు చూపి యాత్మస్తుతి

పడలిపోయెననియు నొకగాథను చెప్పుదురు. భాస్కరునంతటి మహాకవి రాజుపైఁ గలకోపమునఁ దనకృతిని నీచునకియ్యఁ బూనె ననుట యేమాత్రము విశ్వాసార్హము కాదు. సాహిణిమారఁడు గుఱ్ఱములఁ గాచువాఁడు కాఁడనుట కనేకదృష్టాంతములు గలవందున నీకథ కేవలకల్పితమని కొందఱందురు. అది నిజమే కావచ్చును. లేక సాహిణిమారుఁడను వాఁడొకఁడు గుఱ్ఱములను గాచువాఁడుగను నుండవచ్చును. ఆ పేరుగలవాఁడు గుఱ్ఱములకాచువాఁడుగా నుండఁగూడ దను నియమము లేదు గాన నతఁ డుండినను మహాకవి యట్టివానికిఁ గృతి నియ్యఁ బూనుకొనె ననుట యసంగతము గాన నీగాథ కల్పితమే. ఐనను దీనిం బట్టి మాదినను రంగనాథుఁడు రాజునొద్ద నాస్థానకవిగా నున్నవాఁడనియు నతని గ్రంథము రాజుగారి ప్రీతికిఁ బాత్రమనియుఁ దేలుచున్నది.

రంగనాథుఁడు రామాయణమును రచించుచో హనుమంతుఁడు సంజీవికై పోవునప్పుడు కాలనేమి కపటముని వేషధారియై హనుమ నొకసరోవరమునకుఁ బంపనతఁ డచ్చటికేఁగి మకరిచే మ్రింగఁబడి దానిం జంపఁగా నది తనపూర్వవృత్తాంతమును చెప్పుచుండుటమున,

> "ఇది తపఃఫలంబని వెలనాఁగ! నాఁడు, నిది పుణ్యఫలంబని వెలనాఁగ! నాఁడు
> నిది మోక్షసాధన వెలనాఁగ! నాఁడు, నిది స్వర్గసోపాన వెలనాఁగ! నాఁడు."

అని కవి వ్రాయఁగా నాభాగమును విని రాజు తనభార్య యగు వెలనాగయం దాతఁడు బద్ధానురాగుఁ డయ్యె నని కొని తనభార్యతో నాకవి వాంఛితమును దీర్పవలయు నని యాజ్ఞాపించె ననియు, నాసంగతి విని కవి తనకామె యందుఁ గలమాతృభక్తిని దెలిపె ననియుఁ గొందఱు చెప్పుదురు. ఇట్టిగాథల కర్థము లేకపోవుట యే కాక యిట్టివి కవియొక్క నిర్మలమనశ్శుద్ధిని నణంచునవియు నగు నని చెప్పవచ్చును. ఇట్టిగాథల నేమాత్రము ప్రపంచజ్ఞాన మున్నవారైనను విశ్వసింప రనుటలో సంశయ ముండదు.

ఇక్కవి యిప్పటి కేడువందలసంవత్సరముల క్రిందట నున్నవాఁడు. ఇతఁడు రామాయణమును యథామూలముగాఁ దెనిఁగింపక కథను మాత్రమే గ్రహించి కొన్ని తావులం బెంచియుఁ గొన్నితావుల సంకుచితము చేసియుఁ దెనిఁగించెను. ఇంతియే కాక మూలములో లేనిగాథలఁ గొన్నింటిం జేర్చియున్నాఁడు. సులోచనసహగమనము, కాలనేమిచరిత్రము నివి క్రొత్తఁగా నిందుఁ జేర్పఁబడినవి. మూలమున కిది యెట్టిపరివర్తనమో ఆవిషయమును జర్చించుట యనవసరము గాన దానిజోలి మానితిని.

ఇట్టియుత్కృష్టగ్రంథరత్నమున నేలొకో కొన్నిస్ఖాలిత్యములు కనఁబడుచున్నవి. కొన్నింటి నుదాహరించుచున్నాను.

### యతిభంగము

'అనఘ గంగాయనములు గూడి యుఱికి.'' అయోధ్యాకాండము 105 పుట.

### వ్యాకరణవిరుద్ధక్రియలు

'వరతపోనియతిమై వర్షసహస్ర, మరుగఁబారణ సేతుననియున్నచోట.' బా. 54 పుట.

'ఏకల్లిబనిసేతు సేతల్లిఁగొలుతు.' అరణ్యకాండము 161 పుట.

'మనఁజేతు నిప్పుడు మహిమీఁద ననిన.' యుద్ధకాండము. 302 పుట.

### ప్రాసము

'ఓరియూ వానరుఁ డున్నాఁడో లేఁడో, తెర వారఁగా నాకు వివరించిచెప్పు'

యుద్ధకాండము. 293 పుట.

### సంధులు

'అడుగులం చేతులు నంటంటి చూచి, యొడలఁ బ్రాణములు లేకునికి భావించి'

అయోధ్యాకాండము. 111 పుట.

'మునుకొని వార్థుల ముంచి ముంచెత్తు' కిష్కింధాకాండము. 188 పుట.

'మొఱపెట్ట వార్థుల ముంచి ముం చీడ్చి' యుద్ధకాండము. 298 పుట.

### ద్రుతసంధి

'చూపులచేతనే చూడఁ బుత్తనుచు' యుద్ధకాండము. 420 పుట.

### షష్ఠికిముందునగాగమములేమి

'శరభంగనామునియాశ్రమము చేరెంచి. అరణ్యకాండము. 132 పుట.

'అనఘుఁడు వెలిగంది యూరాజాంబవంతు, కనియె విభీషణుం డతిసంభ్రమమున'

యుద్ధకాండము. 379 పుట.

'అని లక్ష్మణుండు పల్కి నావిభీషణుండు, దశమది నూహించి ధరణీశు కనియె'

యుద్ధకాండము. 398 పుట.

### కొసన కుకాదేశము

'బ్రహ్మాదులకు నర్హమదరానియట్టి, బ్రహ్మాస్త్ర మవలీలఁ బట్టుక మ్రింగె'

బాలకాండము. 48 పుట.

'అడవుల కేగను సద్ధిలో వత్తుఁ, దోడుక పొమ్మనఁ దూలి రాఘవుఁడు

అయోధ్యాకాండము. 90 పుట.

# మొదటికూర్పు పీఠిక

శ్రీవాల్మీకిమహర్షిప్రణీతం బగు శ్రీమద్రామాయణము సంస్కృతభాషయం దాదికావ్యము. అది తన్నుపాసించుమానవులకుఁ గల్పతరువుంబోలెఁ జతుర్విధ పురుషార్థంబుల నొసంగుచు మహిమమయంబునఁ జెన్నారు. రామాయణకథ నెఱుంగనిమనుజులు మనదేశంబున లేరని చెప్పవచ్చును. ఈపుణ్యచరిత్రమును సంస్కృతభాష నెఱుంగని యాంధ్రదేశప్రజనుల కుపయుక్తం బగునట్లు తొలుత రంగనాథుఁ డనుకవి ద్విపదకావ్యంబుగా రచియించెను. పిమ్మట భాస్కరుఁడు మున్నగు కవులు పద్యకావ్యంబుగా రచించిరి. అనంతరము కొండొకకాలమున నుత్తరరామకథను గవిబ్రహ్మ యని సన్నుతి గాంచిన తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణం బనుకావ్యంబును నిర్మించెను. ఇప్పటికాలంబున గోపీనాథము వేంకటకవియు, వావిలికొలను సుబ్బారాయకవినాథుఁడును రామాయణకావ్యంబును మూలము ననుసరించి పద్యకావ్యంబులుగా వ్రాసి కీర్తిఁ గాంచిరి. ఇంకను బెక్కండ్రుకవులు రామచరిత్రమును బెక్కుతెఱంగుల వ్రాసియున్నారు.

ఆంధ్రంబున రామాయణమును వ్రాసినవారిలోఁ దొల్తటికవి రంగనాథుఁడు. ఈగ్రంథమున సుపోద్ఘాతమునందుఁ గోనబుద్ధరాజు తనజనకుండగు విట్ఠల నృపాలునియాజ్ఞచే నతని కంకితంబుగ రామాయణము నాంధ్రీకరించె నని యుండుటం బట్టి దీనిని రచించినకవి కోనబుద్ధరాజని యెన్నఁదగి యున్నను దీనికిఁ జిరకాలము నుండి రంగనాథరామాయణ మనియే పేరు కలిగియుండుటచేఁ గోనబుద్ధరాజునొద్ద నాస్థానకవి యగు రంగనాథుఁ డీగ్రంథమును బుద్ధరాజుపేరుతో వ్రాసి తదీయాజ్ఞానుసారంబుగ విట్ఠలధరణీశుపేర నంకితంబు గావించెనో యనుసందేహము పొడముచున్నది. లేకున్న నీగ్రంథమునకు రంగనాథరామాయణ మనుపేరు కలుగుటకుఁ గారణము కానంబడదు.

రంగనాథకవి యేకాలపువాఁడో యేకులమువాఁడో యని తెలియుట కాధారము లేవియుఁ గానరావు. హూణశకము పండ్రెండవశతాబ్దంబున నుండినవాఁడని వీరేశలింగముపంతులుగారు కవిజీవితములో వ్రాసిరి కాని దానికిఁ బ్రబల నిదర్శనములు కానంబడవు. భాస్కరుఁడును రంగనాథుఁడును సమకాలికు లనుట లోకగాథ కలదు. కోనబుద్ధరాజు నాస్థానకవియగు రంగనాథుఁడు రామాయణమును

ద్విపదకావ్యముగా వ్రాయుచుండఁగా దాని నెఱింగి నృపాలుఁడు తన్ను ముందుగాఁ దనకావ్యము నొసఁగి బహుమతు లందఁగోరి భాస్కరుఁడు రామాయణమును బద్యకావ్యముగాఁ దనమిత్రులచేఁ గొంత వ్రాయించి తానుం గొంతభాగమును వ్రాసి పూర్తిచేసి రాజునొద్దకుఁ గొనిపోయెననియు నాసమయంబున రంగనాథుఁడును దా నొనర్చిన రామాయణమును దీసికొనివచ్చి రాజున కొసఁగఁగా నమ్మహీపతి యాశ్రితపక్షపాతంబున రంగనాథుని రామాయణమును దక్షిణహస్తంబున గ్రహించి భాస్కరుని రామాయణము నెడమచేతఁ బుచ్చుకొనఁబోఁగా భాస్కరుఁ డవమానితుఁడై కోపించి నాయుత్తమకావ్యంబును నీయట్టి పక్షపాతముగల నరవరున కిచ్చుటకంటె నీగుఱ్ఱపువాని కిచ్చుట మేలని చెప్పి లేచి పోవుచుండఁగా నతని యశ్వాధ్యక్షుఁడైన సాహిణి మారుఁడు దానునంతయు వినుచుండి, కవీంద్రా! నీ వాడినమాట తప్పక కృతిని నా కిమ్మని వేఁడఁగా భాస్కరుఁడు రామాయణము నతని కంకితము చేసెననియు నొకకథ కలదు. ఇది నిక్కమయ్యెని రంగనాథుఁడును [illegible] పదుమూఁడవశతాబ్దమున నుండినవాఁడని చెప్పవచ్చు.

ఇఁక రంగనాథుని కవిత్వముం గూర్చి యించుక విచారింతము. ద్విపదకావ్యములలో శ్రేష్ఠమైనది రంగనాథరామాయణ మని చెప్పుటకు సందేహము లేదు. అందఱును బ్రౌఢకావ్యములను జదివి వాని యర్థంబుల నెఱుంగుట దుష్కరము. కావున స్త్రీలు లోనగువారికి సులభముగాఁ దెలియుటకై తొల్లి కొందఱు కవీశ్వరులు ద్విపదకావ్యములుగా వ్రాసియున్నారు. హరిశ్చంద్రోపాఖ్యానము, నలచరిత్రము, రాజయోగసారము, పరమయోగివిలాసము, సిద్ధేశ్వరచరిత్రము మొదలగు గ్రంథములు ద్విపదకావ్యములుగా వ్రాయఁబడియున్నవి. రంగనాథుఁడు రామాయణమును వ్రాసిన యనంతర ముత్తరరామాయణము ద్విపదకావ్యముగా రంగనాథుఁడే వ్రాసి కోనబుద్ధరాజుకుమారులైన కాచవిభుఁడును విఠ్ఠలనృపాలుఁడును రచించినట్లు వారికిఁ గృతిపతిత్వ మొసఁగెనని తోఁచుచున్నది.

రంగనాథునిశైలి ద్రాక్షాపాకమై సలక్షణమై రసవంతమై యెంతయు మనోహరముగా నుండును. అన్వయకాఠిన్యము కొంచమైనను లేక చక్కనిజాతీయములతో నొప్పారుచుఁ జదువఁ జదువ మనంబున కానందంబుఁ గలిగించును. గ్రంథమును జదువుచున్నపుడు శ్రీరాముని దివ్యచరిత్రమును గన్నులారఁగనుచు వీనులార వినుచున్నట్లు తోఁచును. కావున రంగనాథరామాయణమును నాంధ్రదేశీయులు పలుమాఱు వీథిపురాణముగాఁ బఠింతురు.

ఇతనికవిత్వమునఁ దెనుఁగుపదములు మెండుగాను సంస్కృతపదములు స్వల్పముగాను నుండును.

తెనుఁగురచనల కుదాహరణము:—

"తిట్టుపాటున కోడి తివిరి నాకొడుకు, పట్టంబు మాన్పించి బలిచెఁ గాక దీన
నొంపేది రాముని బ్రకృతి కైక, చంపు మన్నను బట్టి చంపవే నీవు?
పెద్దకాలము నాకు బిడ్డలు లేక, పెద్దయుం జింతించి పెక్కులు నోచి
కడపట నొక్కనిఁ గని యేను గొంత, యుండు కాలి యున్నచో నుండనీవైతి"

అయోధ్యాకాండము. పుట. 107

ఇక్కడి తెలుఁగుశబ్దములు విశేషముగాఁ బ్రయోగించుచున్నను దనపాండిత్యమును దెల్పుటకై యక్కడక్కడ సంస్కృతరచనలును గావించియున్నాఁడు. ఉదాహరణము:—

"గంధకస్తూరికాకలితాంబుపూర, గంధిలసకలమార్గధరాంగణంబు
చీనిచీనాంబరశ్రేణివితాన, నానామణీతోరణధ్వజాంచితము
ఫలభారకమ్రరంభాస్తంభపూగ, కలితప్రతిద్వారకనత్ప్యంతరంబు
సాంకపాళిస్తనవిస్తారవితస్త, గాంకితరంగవల్ల్యాదిశోభితము
మణిశిలాతతసంభసంఘవితర్కితార్క, గణసౌధగోపురగోత్కరశిరోగ్రంబు" బా. పు. 63

ఈగ్రంథంబునందు రంగనాథకవి శబ్దాలంకారములను నర్థాలంకారములను సమయోచితంబులుగా నందందుఁ బ్రయోగించి యున్నాఁడు. శబ్దాలంకారముల కుదాహరణములు:—

"రాముని జితభృగురామునిఁ గాంచి, సోముని సద్గుణస్తోముని కీర్తి
ధాముని సౌందర్యకాముని శాంతి, భూముని రవిసమధాముని బాసి" అయో. పుట. 82.

"కమనీయమృదుకరకమలయుగ్మములఁ, గమలము ల్బూంచితురు గమలంగఁ బట్టి
కమలాకరంబులఁ గమలాక్షుఁ డెలమిఁ, గమలాభిరామునుబోలి కమలముల్ నొంచు"

యుద్ధకాండము. పుట. 247

"జగతీతనూజాత జగదేకమాత, నిగమసన్నుతపూత నిగమవిఖ్యాత
యమితగుణోపేతయైనయాసీత......" యుద్ధకాండము. పుట. 282

219-220 పుటలలోఁ గన్పడు వర్షాకాలశరత్కాలవర్ణనలందును 313 పుటయందుఁ గన్పట్టుచంద్రోదయవర్ణనలందును నుపమోత్ప్రేక్షాస్వభావాద్యర్థాలంకారములు తెలియునది.

రంగనాథుఁడు లాక్షణికుం డగుమహాకవియయ్యుఁ జంద్రునందుఁగళంకముం బోలె నితనికావ్యంబున నక్కడక్కడఁ గొన్ని లక్షణవిరుద్ధములు గానంబడియెడి.

"ఏతల్లిపని సేతు నేతల్లిఁ గొలుతు" పుట. 161

ఒకానొకచోట రేఫశకటరేఫలమైత్రియుఁ జూపట్టుచున్నది:—

"మీఱి తాపసులను మ్రింగెడువీవు, వారు తాపసులను వడిఁ బ్రోతురెపుడు" పుట. 282

యమని మగుడుగుఁ జేయుండుఁ బోయి, యమునిసుతుఁడు నింక నిటమీఁద నేను
వామాక్షిఁ గానక వచ్చితి ననిన, రాముఁ డప్పుడె పోయి ప్రాణవాయువుల
నన్నెడు సౌమిత్రి యనుగు పెన్నార్త, విన్నంత భరతుండు విడుచుఁ బ్రాణముల
నతనికై శత్రుఘ్నుఁ డిలలబొందుపవులు, హాయి యీడు రఘువంశ మంతయు సమయు
నని వాలి సుగ్రీవుఁ డాయింగదుండు, మొదలైన కపిసంఘము నాశమొందుఁ
గాన వానరప్రముఖుల మహాటవుల, నేను గావుండు సిదియుఁ గాదని
పొదఁ దీర్చుకొని యగ్నిఁ జొత్తు నందేని, యందఱలఁ గడచన్న నుసురాస దక్కి
యక్కట సంపాతి యాడినమాట, నిక్కంబుగా నమ్మి నీరధి దాఁటి
యిచ్చటి కొంటికై యేనచ్చు టెల్ల, నచ్చుగా వృథ మయ్యె నోఁగాక యని"

272 . పుట చంద్రోదయవర్ణన మెంతమనోజ్ఞముగాఁ జేయఁబడినది చూడఁదగు.

"కృతకృత్యుఁ డగుచుఁ గాముఁడీ త్రిభువనములు, చతురతనై పెంచల్లినయట్లు
నెరపెను బాకలు గాన్పించె నంతఁ, జిరకాలములనీడు శిశువులమాను
పాలుపొంగుకలుపలపోరాని విందు, కలసినజక్కవకవఁ బాపు మందు
పాలవెల్లిని దచ్చిపడసిన వెన్న, తూలియాఁడలపూవు చుక్కలనవ్వు
నెలచకోరములకు నలనల పంట, యురవీని విరహుల నుడికించుమంట
గగనంబుతోఁ గల్గొను దొంగలగుండె టిగులు, వాగి నబ్ధిఁ బొంగించు నాటపట్టి
యంగజునౌరల వెన్నెలనవ్వు, సరసిజరిపుఁ డైన చంద్రుఁడు పొడిచె"

ఇట్టి వర్ణనలు మఱియుఁ బెక్కు లున్నవి. వానిం జదువరు లారయునది.

తేనియ తేఁటలంబోని మధురరసవచనంబులు నివ్వటిల్ల "ససమానలలితశబ్దార్థ సంగతులఁ...బరఁగ నలంకారభావనల్నిండ" నీరామాయణమును రచియించిన రంగనాథకవి నెంతయేని నుతింపఁ దగియుండెడు. చరిత్రము శ్రీరాముని దగుటచే నిది పరమపావనంబును సకలపురుషార్థప్రదంబును గలికలుషవిధ్వంసనచణంబును గావున దీని నాంధ్రదేశీయులెల్లరుఁ బరమాదరంబునఁ బఠించుచుఁ గృతకృత్యులై యెల్ల సౌఖ్యములఁ బడయుచు నానందింతురుగాక.

నాగపూడి - కుప్పుస్వామయ్య.

# విషయసూచిక

---

## బాలకాండము

## అయోధ్యాకాండము



## అరణ్యకాండము

## కిష్కింధాకాండము

| విషయము. | | పుట. |
|---|---|---|
| కుంభనికుంభాదులు యుద్ధమునకు వచ్చుట | ... | 383 |
| కుంభనికుంభులయుద్ధము | ... | 385 |
| మకరాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట | ... | 387 |
| ఇంద్రజిత్తు హోమము చేసి కృత్తియనుశక్తి బుట్టించి చేకొని మాయాయుద్ధము చేయుట | ... | 389 |
| శ్రీరాముఁ డాగ్నేయాస్త్రముచే నింద్రజిత్తునిమాయ దెరల్చుట | ... | 391 |
| ఇంద్రజిత్తు హోమము జేసి శస్త్రసమేతముగా రథమును బడయుట | ... | 392 |
| ఇంద్రజిత్తు మాయాసీతను నరికి తల దునుముట | ... | 395 |
| ఇంద్రజిత్తు నికుంభిళయాగము చేయుట | ... | 396 |
| విభీషణుఁ డింద్రజిత్తునిమాయ శ్రీరాములతోఁ జెప్పుట | ... | 398 |
| లక్ష్మణుఁడు యుద్ధమునకు వెడలుట | ... | 400 |
| ఇంద్రజిల్లక్ష్మణులద్వంద్వయుద్ధము | ... | 402 |
| లక్ష్మణునిచే నింద్రజిత్తు చచ్చుట | ... | 406 |
| రావణుఁ డింద్రజిత్తుమరణమునకు శోకించుట | ... | 408 |
| రావణుఁడు సీతను నఱక వేయఁ బోవుట | ... | 410 |
| ఇంద్రజిత్తుభార్య సులోచన శోకించుట | ... | 411 |
| సులోచన శ్రీరాముల నుతించుట | ... | 412 |
| సులోచన సహగమనము చేయుట | ... | 415 |
| మూలబలయుద్ధము | ... | 416 |
| శ్రీరాముఁడు మూలబలముపై మోహనాస్త్ర మేయుట | ... | 418 |
| రాక్షసస్త్రీలు రావణుని నిందించుట | ... | 419 |
| రావణుఁడు [illegible] యుద్ధమునకు వెడలుట | ... | 422 |
| సుగ్రీవునిచే విరూపాక్షుఁడు మొదలగు రాక్షసవీరులు చచ్చుట | ... | 424 |
| రావణుఁడు రామలక్ష్మణులపైఁ గవియుట | ... | 426 |
| రావణునిశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట | ... | 428 |
| రావణుఁడు విభీషణాదులమాటలఁ దలంచి చింతించుట | ... | 429 |
| లక్ష్మణునిమూర్ఛకు శ్రీరాముఁడు శోకించుట | ... | 431 |
| హనుమంతుఁడు సంజీవకరణికొఱకు ద్రోణాద్రికిఁ బోవుట | ... | 433 |
| కాలనేమివృత్తాంతము | ... | 433 |
| హనుమంతుని మకరి మ్రింగుట | ... | 436 |
| ధాన్యమాలి తనశాపప్రకారము హనుమంతునితోఁ జెప్పుట | ... | 436 |
| మునివేషధారి యగు కాలనేమిని హనుమంతుఁడు చంపుట | ... | 438 |
| హనుమంతునితో మాల్యవంతుఁడు పోరుట | ... | 441 |
| శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి [illegible] | ... | 442 |
| సుషేణుఁడు సంజీవకరణిచే లక్ష్మణునిమూర్ఛఁ దేర్చుట | ... | 444 |

ననిన భరద్వాజుఁ డాదిగా శిష్యు, లనురక్తిఁ బనియించి కొనిపోవ నంత
ననఘుఁ డావాల్మీకి యాశ్రమంబునకుఁ, జనియున్నచో బ్రహ్మ చనుదెంచుటయును
నెదురేఁగి పదముల కెఱఁగి తోడ్తెచ్చి, కుదురుగాఁ గుశపీఠిఁ గూర్చుండఁ జేసి
కరమర్థిఁ బూజించి కరములు మోడ్చి, పరఁగ శాపాక్షరపద్యంబుఁ జదువ
విని బ్రహ్మ నగి పద్యవిషయమై వాణి, యనఘ నీముఖమున నవతరించినది
శ్రీరామచరిత మశేషంబు నీకుఁ, గోరి నారదుఁడు సంక్షేపించి చెప్ప
నది విస్తరించి నీ వఖిలంబు చెప్పు, మది సర్వమును దోఁచు నని చెప్పి పోయె
నీరీతిఁ గృప వరం బిచ్చి మన్నించి, సారసగర్భుండు చనిన పిమ్మటను
మఱి నిర్మలధ్యానమతిఁ బూని మౌని, తఱిఁగొని సకలంబుఁ దలపోసి చూచి
రఘుచరిత్రము దశరథుచరిత్రంబు, రఘురాముజన్మంబు రాముని గమనము
తాటకావధము నుద్దండ రాక్షసుల, [1]యాటోపహరణంబు యజ్ఞరక్షణము
దనరు గంగామహత్త్వంబు గౌతముని, వనితను శాపంబువలనఁ బాపుటయు
ధనువు ద్రుంచుటయు సీతావివాహంబు, చనుచోట జమదగ్నిజాతునాగ్రహము
రామాభిషేకసంరంభంబు దుష్ట, కామిని కైకేయి కష్టభాషణము
నభిషేకవిఘ్నంబు నడవికి రామ, విభుఁడు వోవుటయును భూవిభునిశోకంబు
దశరథుమరణంబు దశరథరాముఁ, గుశలసంభాషిగా గుహుఁడు గాంచుటయు
నురుపుణ్యు లట గంగ నుత్తరించుటయు, వరతపోనిధి భరద్వాజుఁ గాంచుటయు
నరిగి యాచిత్రకూటాద్రి నెక్కుటయు, భరతుండు రఘురాముపజ్జ వచ్చుటయు
నన్నచేఁ బాదుక లర్థిమైఁ బడసి, [2]మన్నన నింపార మగిడి వచ్చుటయు
దండకాగమనంబు తగిలి విరాధుఁ, జండవిక్రము నందు సంహరించుటయుఁ
బరమపుణ్యుని శరభంగుఁ గాంచుటయు, బరుసడి మునులతోఁ బ్రతిన లాడుటయు
చనియయ్యగస్త్యునాశ్రమముఁ జొచ్చుటయు, మునిచేత దివ్యాస్త్రములు వడయుటయు
మునిచెప్పఁగా వారు ముదమున వేగ, చని పర్ణశాలలో సరగ నుండుటయు
మోహించి రాక్షసి మొనసి వచ్చుటయు, నూహించి దానితో నొగిఁ బల్కుటయును
ద్రుక్కుక రామానుజుండు శూర్పణఖ, ముక్కును జెవులును గోయ సేయుటయుం
నదివోయి ఖరదూషణాదిరాక్షసుల, కది చెప్ప వారంత నరిగి వచ్చుటయు
నురవడి రఘురాముఁ డొక్కఁడే కడఁగి, ఖరదూషణాదుల ఖండించుటయును
నట రావణునిబుద్ధి నలుకఁ బుట్టుటయుఁ, గుటిలమారీచుండు [illegible] వచ్చుటయు
నసురాధిపతి సీత నపహరించుటయు, వినువక రాముఁడు విలపించుటయును
నని జటాయువుచావు నవలఁ గబంధుఁ, గనుటయు మఱి పంపకడకుఁ బోవుటయుఁ
గరమర్థి ఋశ్యమూకమున సుగ్రీవుఁ, డరుదెంచి కనుటయు నతనిసఖ్యంబు
వాలిసుగ్రీవుల వైరంబు తెలుపు, చాలంగ రాముండు సప్తసాలముల
నేలఁ గూలఁగ నేసి నెమ్మి మెప్పించి, వాలి నొక్కమ్మున వధియించుటయును
దారావిలాపంబు దశరథసూనుఁ, డారవిసూను రాజ్యమున నిల్పుటయు

---

1 యాటోప మణఁచుట. 2 మన్ననతో చేసి.

వానరపతి యంత మాల్యవంతమున, వానకాలం బెల్ల వసియించుటయును
గాకుత్స్థుకోపంబు కపిసమాగమము, నేకతంబున ముద్ర నిచ్చి పుచ్చుటయు
నలయక కపులు సీతాన్వేషణంబు, సలుపుటయును బిలసందర్శనంబు
నాతఱిఁ బున మహేంద్రాద్రి నెక్కుటయుఁ, బక్షీంద్రుఁడైన సంపాతిదర్శనము
వనధిలంఘనమును వనధిమధ్యమునఁ, జను చోట మైనాకసందర్శనంబు
మదమెత్తి సింహిక మారుతసూనుఁ, గదిసి చచ్చుటయు లంకాప్రవేశంబు
లంకను నొప్పించి లలనచే నచట, లంకత్రోవయుఁ గని లంకఁ జొచ్చుటయు
నతఁడు పురంబున కరిగి చూచుటయు, నంత నశోక వనావలోకనముఁ
దెలిఁగొప్ప నందు వైదేహిఁ గాంచుటయు, నెఱుకకు నానవా లిచ్చి దేర్చుటయుఁ
బెనచి యావనమెల్లఁ బెఱికి వైచుటయు, హనుమంతుఁ డత్తఱి నక్షుఁ జంపుటయుఁ
బవనజుఁ డటఁ బట్టువడి పోవుటయును, గవిసి లంకాపురి గలయఁ గాల్చుటయు
మానినీమణి శిరోమణి యిచ్చుటయును, మానితాత్ముం డబ్ధి మరల దాఁటుటయు
మధువనహరణంబు మణిఁ బ్రీతి నిచ్చి, యధిపతి మారుతి యాశ్వసించుటయు
నినకులాధిపుఁడు దండెత్తి పోవుటయు, వనధితీరంబున వచ్చి నిల్చుటయు
వనరాశి త్రోవయియ్యక క్రొవ్వుటయును, గొనకొని రాముండు కోపించుటయును
నంత విభీషణుఁ డధిపుఁ గాంచుటయుఁ, జింతించుటయు మఱి సేతుబంధనము
జలధి దాఁటుటయును జని లంకమీఁద, విడిసి పేర్చుటయు దోర్వీర్యంబు మెఱసి
కరముగ్రు లగు కుంభకర్ణాది వీర, వరులఁ ద్రుంచుటయు రావణునిఁ జంపుటయు
నావిభీషణుని లంకాధినాయకునిఁ, గావించి పట్టంబు కరుణఁ గట్టుటయు
ననుపమశుద్ధి బ్రహ్మాదులు మెచ్చ, జనకజ రఘురామచంద్రుఁ బొందుటయు
నెలమిఁ బుష్పక మెక్కి యెల్లరు వేడ్కఁ, జెలఁగి యంభోనిధిసేతువుమీఁదఁ
దెలిసి శ్రీకంఠుఁ బ్రతిష్ఠ సేయుటయు, వెలయ నయోధ్యకు వేగ వచ్చుటయు
భరతుఁ గాంచుటయును బట్టాభిషేక, మరుదుగా రఘురాముఁ డవధరించుటయుఁ
గపిసైన్యపతుల నర్కజవిభీషణుల, విపులసంపద లిచ్చి వీడుకొల్పుటయుఁ
బరికించి ప్రజల కాపదలొందకుండఁ, గరుణఁ బ్రోచుట యనుకథ లెల్లఁ దెలిసి
వెలయ నిర్వదినాల్గు వేలశ్లోకములు, గలిగి యేనూఱు[1] సర్గల విస్తరిల్లి
కాండంబు లాఱింటఁ గర మొప్ప మిగిలి, యుండ రామాయణ మొప్పఁ గావించి
యొనరఁ దక్కిన కథ లుత్తరకాండ, మునఁ జెప్పె వాల్మీకిమునినాథుఁ డంత
ఈకథ పఠియింప నెవ్వరు నేర్తు, రీకథ జగముల నెబ్భంగి వెలయు
ననుచుండ కుశలవు లనఘమానసులు, మనసిజాకారులు మంజుభాషణులు
జనసుతుల్ సంగీతసాహిత్యపరులు, మునివేషధారు లిమ్ముల వచ్చి మ్రొక్క
యనఘ రామాయణం బర్థితోఁ జదువఁ, జను దెంచితిమి మమ్ము[2] చదివింపవలయు
ననిన సంతోషించి యమ్మునీశ్వరుఁడు, తన మనోరథ మెల్లఁ దలకూడె ననుచు
గేయమై పాఠ్యమై కేవల పుణ్య, దాయకం బగు రఘూత్తమచరిత్రంబు

---

1 సర్గముల వర్తిల్లి. 2 చదువనీవలయు.

సమపమతంత్రీలయాన్వితభణితి, మునిపతి చదివింప మును మెప్పుఁ జనివి
రమణ శృంగారాది రసము లేర్పడఁగ, సమవృత్తశోభితముల్ సంధి సమాస
సముధికశబ్దార్థసంగతుల్ వెలుఁగ, క్రమమొప్పఁ బాడుచుఁ గనగా నపుడు
మునిజనసభల నిమ్ములఁ బూజనములు, గొని పరితోషింపఁ గాదుల బ్రసన్నభంగుల
వెలయఁ దమ్ములు దాను వేడ్కఁ దింపొంద, గొలువున్న యారలఁ గోరి రావించి
వారిరూపంబులు వారినిల్కడలు, వారివిన్నాణంబు వాగ్విశేషములు
తనకు నింపొనరింపఁ దత్కథాక్రమము, వినుచుండ రాముఁడు సవిస్తరమొప్ప వినిన
ద్వాదశయోజనాయతమై యగుచు, నట మూఁడుయోజనములఁ బొడ వెడల్పగుచు
నిపుణత మనువుచే నిర్మితంబగుచు, నెప్పుడు శాత్రవకోటి కెదురుచు నెగ్గుచు
కొలఁదిమీఱిన భానుకులజుల వల్లఁ, గులరాజధానియై కొనియాడఁ బరఁగి
సరయువుప్రాంత కోసలదేశమునను, ధరణికిఁ దొడవైన తనరు నయోధ్యాపురం బొప్పు
మణిగోపురంబుల మణితోరణముల, మణికుట్టిమంబుల మణిగవాక్షములఁ
గేళికాగృహములఁ గృతకశైలముల, బాలానిలంబులఁ బటుహయంబుల
మహితవారణముల మానితాశ్వముల, బహువనితాప్రతతుల భటకదంబముల
విమలసౌధంబుల విపణిమార్గములఁ, గమనీయవనములఁ గమలాకరములఁ
జెలువుల బావులఁ జెఱకుఁదోఁటలను, నలువైన శాలికేదారవారములఁ
బరిఖలఁ గోటలఁ బసిడిమాడువులఁ, గర మొప్పు లోకవిఖ్యాతమై పరఁగు
నాపురి దశరథుం డనుమహారాజు, చాపవిద్యానయజాలకౌశలుఁడు
చతురుపాయజ్ఞుండు షాడ్గుణ్యశాలి, సతతసత్యవ్రతసంధానశాలి
ధర్మోత్తరుఁడు కృతాభ్యాసుఁడు శ్రీకరుండు, ధర్మశాస్త్రపురాణాగమార్థవర్తనుఁడు
అజునినందనుఁడు బాల్యంబుగా నియతిఁ, బ్రజలఁ బాలించిన పరమపావనుఁడు
జంభారికై పోయి శంబరాసురుని, దంభం బణంచి సుత్రామునిచేత
మందారపుష్పదామములు చేకొన్న, యిందుమతీపుత్రుఁ డినకులాధిపుఁడు
తేజంబు కాంతియుఁ దెగువయు నేర్పు, రాజసంబును నుదారతయు నైశ్వర్యంబు
మొదలైనసద్గుణంబులప్రోది యగుచు, సుదయార్కుగతిఁ దనయుగ్రతేజంబు
దీపితంబై యేడుదీవులఁ బర్వ, భూపాలతిలకమై పొలుపొందు నేలు
నన్నరనాథుకులాంగనామణులు, మున్నూటయేఁబండ్రు ముఖ్యలై యుందు
నచలతసౌశీల్య యైనకౌసల్య, కుచకుంభనిర్జితకోక యాకైక
యనఘచరిత్ర యా నాసుమిత్రయును, వినుతికెక్కిరి త్రయీవిద్యలో యనఁగ
నిలమీఁద నతనికి హితపురోహితులు, పొలుచువసిష్ఠాదిపుణ్యసంయములు [illegible]
అనఘాత్ముఁడు ధృష్టియనువాఁడు విజయుఁ, డనువాఁడు సిద్ధార్థుఁ డనువాఁడు ను
నర్థసాధకుఁడు జయంతుఁడు నీతి, తీర్థుఁ డశోకుండు ధీమంతుఁడైన
మంత్రపాలకుఁడు సుమంత్రుండు ననఁగ, మంత్రులు గల రెనమండ్రు నాతనికి
ఆమంత్రులందఱు నన్యోన్యహితులు, స్వామికార్యవిచారచతురమానసులు
పరమర్మభేదనోపాయధౌరేయు, లరసి ప్రజానీక మాచరింపుదురు

దేమి పాపముననో యెఱుఁగఁ జొప్పడక, యామహిలో వర్షమటు సున్నకయ్యె
దా నేలి పాలించు ధరణిపై నెందు, వానలు లేకున్న వగలను జెంది
వరమునీంద్రులచేత వర్షహోమములు, పరువడి సేయించి పడయ కాకున్న
భూరిశోకంబునఁ బొగలుచు నున్న, యారాజుఁ గనుఁగొని యమాత్యులనిరి
యోమహీపాలక యోరాజచంద్ర, యీమహిపై వాన పెట్టఁ బన్నుటకును
నొకయుపాయమ్ము మే మొగిఁ జెప్పువార, మకలంకమతితోడ ననువొందఁ బేరు
పరహితోన్నతుఁడు విభాండకసుతుఁడు, చిరపుణ్యనిధి ఋశ్యశృంగుఁ డన్వాఁడు
నగధైర్య పుట్టిననాఁట నుండియును, నగరరాష్ట్రంబు లెన్నఁడు నెఱుంగమిని
నతఁ డెందు నాఁడువారను పేరు నెఱుఁగఁ, డతఁడు తాపసవృత్తి నడవులనుండు
వసుధేశ యతఁ డిందు వచ్చినఁ జాలు, వెసఁ బాయు నీయనావృష్టిదోషంబు
నావుడు మునినాథు నగరి కేరీతి, రావింతు నని విచారము చేసి తెలిసి
అతఁడు వచ్చుటకును నాత్మఁ జింతించి, మతిమంతు లగునట్టి మంత్రులఁ బిలిచి
మునులను రప్పించి ముదమొప్ప నడుగ, మునులును మంత్రులు మునుపముతోఁ జెప్ప
మనమున సంతోషమహిమ శోభిల్ల, మునులమాటలు విని మోదంబు మీఱ
నుండెను భూకాంతుఁ డోగి మూసు లనిరి, దండిగ నో రాజ తలపోసి యిప్పుడు
వారకాంతల నెల్ల వసుధేశ పంపు, వారకాంతలచేత వనముల కిపుడు
దండిగా భక్ష్యముల్ దగ వారి కిచ్చి, మెండుగ వనముల మేటి వస్తువులు
పెట్టి పంపుము నీవు పెంపుతో ననుచు, గట్టిగాఁ గాంతలు కడుఁ బ్రౌఢసతులు
తిన్నగ నటు పోయి తెఱఁగొప్పఁ గాంచి, మున్న [illegible] నిమహిమ వీక్షించి
తియ్యని భక్ష్యముల్ తెఱఁగొప్ప నిచ్చి, నెయ్యంబుచే మది నెఱిఁ గరఁగించి
యాటలఁ బాటలఁ దేటమాటలను, బాటలగంధులు పదిలులై నిలిచి
మనసెల్లఁ గరఁగించి మఱి వెంటనంటి, మనసిజాకారలు మఱి మాయ నన్ని
యచ్చుగ నిటు రాఁగ నతఁడు వెం దగిలి, వచ్చు నిచ్చటికిని వసుధేశ వినుము
అని చెప్పి మునివర్యు లటఁ జనిరంత, ఘనముగా నా రాజు కరుణ నాఁగాత్రి
మన మలరఁగ నుండి మఱునాఁడు లేచి, మునులను దలఁచుచు ముదమొప్ప నంత
ననురక్తిఁ గడుఁ బ్రౌఢ లగు వారసతుల, వినుతయౌవనరూపవిభ్రమవతుల
మనసిజమోహనమంత్రదేవతలఁ, బనిచె నొప్పెడువారిఁ బాటించి యతఁడు
అతివ లమ్ముని యున్నయడవికిఁ బోయి, యతనియాశ్రమభూమి కల్లనఁ జేరి
చతురనర్తనకళాసంగీతగతుల, నతనికిఁ దమయొప్పు లర్థిఁ జూపుటయు
నాపుణ్యనిధి వారి నాఁడువా రగుట, రూపింప నేరక రుచులఁ జేపడక
యలసయానముల నీయడవిలో నొప్పు, మెలఁగెడు నివి వింతమృగములోఁ గాక
యనుచుండ నొక్కనాఁ డతివలు ప్రీతిఁ, దనుఁ జేరవచ్చినఁ దప్పక చూచి
చన్నులవే రద్ది చన్నులమీఁద, నున్నహారములకు నుసదేశ మడిగి
మాకుఁ గొమ్మొక్కటి మస్తకమ్మునను, మీకుఁ గొమ్ములు రెండు మెఱసెఁ ఱొమ్మునను
నేవృక్షములఁ గల్గె నివి యపూర్వములు, మీవల్కలము లతిమృదులంబు లరయ

యినకులోత్తముఁ డిచ్చె నెల్లవస్తువులు, మనమార నప్పుడు మహిమ దీపింప
సకలభృత్యామాత్యసహితుఁడై వేడ్క, నకలంకచిత్తుఁడై యటఁ గొలు వుండె
నప్పుడు సౌమిత్రి ననురక్తితోడ, నొప్ప నిద్రాదేవి యొగిఁ బొందుటయును
గొలువులోపలను గాకుత్స్థునియెదుటఁ, గలకల నవ్వెనఁ గమలాప్తకులుఁడు
జనకజయును విభీషణుఁడు సుగ్రీవుఁడును మారుతాత్మజుఁడును వాలిసుతుఁడు
నలనీలశరభసన్నాథతారాది, బలిముఖుల్ శత్రుఘ్నభరతులు భీతిఁ
దలలు వాంచిరి యప్డు తమయందుఁ జెంది, లలి మీఱినట్టి కళంకము ల్దలఁచి
యందఱు నట్లుండ నలుక చిత్తమునఁ, జెంద లక్ష్మణుఁ జూచి శ్రీరాముఁ డనియెఁ
దగవు వోవిడిచి యాస్థానంబునందు, నగుటేమి నిష్కారణముగ సౌమిత్రి
అనవుడు భయమంది యాలక్ష్మణుండు, తనకరంబులు మోడ్చి తగ నిట్టు లనియె
వనవాసమునకు దేవరఁ గొల్చి వచ్చి, వనముల నున్నచో వచ్చెఁ జూ నిదుర
వచ్చినఁ బదునాల్గువత్సరంబులకు, నచ్చుగాఁ జేరకు మన నిద్ర చనియెఁ
బదునాలుగేండ్లును బరఁగ నిండుటయు, వదలక యిప్పుడు వచ్చెఁగా నిద్ర
యదికారణంబుగా నవనీశతిలక, యిది యేను నవ్వితి నిదియె నాతప్పు
నీవు సహింపుమో నిఖిలాధినాథ, దేవదేవేశ యో దీనమందార
యనవుడు సంతోషమంది రందఱును, ననుమానములు వాసి యలరి రెంతయును
నిర్మలకారుణ్యనిధి రాముఁ డంత, నర్మిలి నిండార నందఱఁ జూచి
యెల్లతెఱంగుల నెట్టికార్యముల, నెల్లధర్మంబుల నేమఱ కెపుడు
గొనకొని చేయుఁడీ కోర్కి దీపింప, ననువొంద ననుచు నత్యాదరం బొప్పఁ
బొండని కడఁకతో బుద్ధులు గరపి, యొండొండ ప్రియముల నూఱడఁ బలికి
యనిలజసుగ్రీవు లాదిగాఁ గపుల, దనుజపుంగవుల నత్తఱి వీడుకొలుప
కిష్కింధ కెలమి సుగ్రీవాదికపులు, నిష్కళంకాత్ములై నెమ్మితోఁ జనిరి
చనియె లంకకు విభీషణుఁ డర్థిఁ దన్ను, దనుజులు గొలువ నుత్సవకేళిఁ దేలి
రాముఁడు మఱియావరాజ్యంబునందు, సౌమిత్రిభరతులఁ జతురమానసులఁ
దగఁ బ్రతిష్ఠించి యాతతరాజ్యభూతిఁ, దగిలి సుఖించుచుఁ దాను సీతయును
సకలభోగంబుల సౌఖ్యంబునొంది, యకలంకచిత్తుఁడై యనవరతంబు
వేదోచితాచారవిమలమార్గమున, నాదిరాజన్యుల నందఱఁ గడచి
పూజితానుష్ఠానములు నశ్వమేధ,వాజపేయాదికవరయాగతతులు
సొలవక చేయుచు సురలభూసురుల, నెలమి రక్షించుచు నేపుదీపింప
నిండార ధర్మైకనిష్ఠతోఁ బదునొ,కొండువేలేండ్లు దా నుర్విఁ బాలించెఁ
బాలించి యేలుచోఁ బ్రజలు దుఃఖములఁ, దూలరు దురితము ల్దుర్భిక్షతతులు
కలుగ వెయ్యెడలను గాలదోషములఁ, జలియింప వెన్నఁడు సత్యధర్మములు
పరహితాచారతాత్పర్యంబులెల్ల, పురుషులయందును బొలుపారుచుండు
ననియాంధ్రభాషభాషాధీశనిభుఁడు, వినుతకావ్యాగమవిమలమానసుఁడు
పాలితాచారుండపారధీశరధి, భూలోకనిధి కోనబుద్ధభూవిభుఁడు

తనతండ్రి విట్ఠలధరణీశుపేరఁ, గమనీయగుణధుర్యకనకాద్రి పేరఁ
బనిపూని యరిగండభైరవుపేర, ఘనుపేర మీసరగండనిపేర
నాచంద్రతారార్కమై యొప్పు మిగుల, భూచక్రమున నతిపూజ్యమై వెలయ
నసమానలలితశబ్దార్థసంగతుల, రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్నిండఁ, గరమర్థి నీయుద్ధకాండంబు చెప్పె
నారూఢి నార్షేయమై యాదికావ్య,మై రసికానందమై యెల్లనాఁడు
నివ్వసుమతి నొప్పు నిప్పుణ్యచరిత, మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
సామాదిబహువేదచయధామరాము, నామచింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్ప్రభువిచారములు, పరిపూర్ణశక్తులు ప్రకటరాజ్యములు
నిర్మలకీర్తులు నిత్యసౌఖ్యములు, ధర్మైకనిష్ఠలు దానాభిరతులు
నాయురారోగ్యంబు లైశ్వర్యములును, బాయకపాటించుఁ బాపక్షయంబు
వరపుత్రలబ్ధియు వైరినాశనము, సరినొప్పు ధనధాన్యచయసమృద్ధియును
నేవిఘ్నములు లేక యిండ్లలో నధిక, లావణ్యవతులైన లలనలపొందు
కొడుకులతో నెప్డుఁ గూడియుండుటయు, నెడగాఁగ నాపదలెల్లఁ బాయుటయు
సమ్మదంబున బంధుజనులకూటమియు, నిమ్ములఁ గామ్యంబు లెడపకుండుటయు
సతతంబు దేవతాసంతర్పణంబు, పితృగణతృప్తియుఁ బెంపారుచుండు
వ్రాసినవారికి వరశుభోన్నతులు, వాసవలోకాదివాసులఁ జేయు
నిది మోక్షసాధనం బిది పాపహరము, నిది దివ్య మిది భవ్య మిది శ్రీకరంబు
ఎందాఁకఁ గులగిరు లెందాక జలధు, లెందాక రవిచంద్రు లెందాఁకఁ దార
లెందాక భువనంబు లెందాఁక దిశలు, నెందాఁక వేదంబు లేపుదీపించు
నందాఁక నీకథ యక్షరానంద, సందోహదోహళాచారమై పరఁగు.

శ్రీరంగనాథరామాయణము యుద్ధకాండము

సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949

# పద్యకావ్యము

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| అడవిమల్లెలు | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | 0 | 10 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | 1 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | 1 | 8 |
| ,, టీక | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | 4 | 0 |
| అరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిషట్కము | 7 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకా॥మూ॥ | 0 | 3 |
| ,, టీకతో బ్రౌనుపేపరు | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాషార్ణవము | 1 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | 6 | 0 |
| ఉత్తరహరివంశము | 3 | 0 |
| కవిరాజమనోరంజనము | 1 | 4 |
| కృష్ణదండకము | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | 0 | 8 |
| కాశీఖండము | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక,(భాగవతం) | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామామృతనిధి | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము. విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 8 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | 0 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | 0 | 8 |
| చెన్నబసవపురాణము | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | 2 | 0 |
| తెనుగుసమస్యలు | 0 | 3 |
| దశావతారచరిత్ర | 3 | 0 |
| దసరాపద్యములు | 0 | 2 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | 0 | 8 |
| నలచరిత్ర, ద్విపద, కాలికో బైండు | 2 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | 3 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్న సై॥జు॥ | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | 3 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.